ఓమ్

# తెనుగు మీరా

ఇరువదెనిమిది పదములు——రాగతాళములతో

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి

'పరిచయము' స్వరకల్పనలతో

రామచంద్ర కౌండిన్య

ఆంధ్ర హిందీ పరిషత్

హిందీ ప్రచార సభ హైదరాబాదు



అంకితము

చల్లని చూపురూపుల
ఎల్లవిద్యల యెఱుక గన్నతలపు పలుకుల
రమ్యులు నభిగమ్యులు
పరహితాచరణ దక్షులు ఆంధ్ర విశ్వకళా
పరిషదుపాధ్యక్షులు
నా కధ్యాపకులు
శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణులకు



# పదసూచి



# पद-सूची



# తొలి పలుకు

భారతీయుల జీవితము వివిధ భారతీయ భాషలలో మూర్తీభవించి యున్నది. ఈ భాషలను ఉపేక్షాభావముతో చూచుట వీని యందున్న భారతీయ జీవితమునే ఉపేక్షించుటయగును. మన దేశము యొక్క వివిధ భాషల సాహిత్యములలో వేల సంవత్సరముల భారతీయ జీవిత మిమిడియున్నది. ఈ భారతీయ జీవితమును, సంస్కృతిని తెలిసి కొనుట మన భావిభాగ్యోదయమునకు అత్యావశ్యకము.

భారత రాజ్యాంగ విధానములో అంతర రాష్ట్రీయావశ్యకతకై రాజ భాషగా హిందీ గుర్తింపబడినది. అయితే, ఎప్పటివరకు భారత దేశమందలి వివిధ భాషాసాహిత్యవేత్తల ఆచరణ రూపమైన సాహాయ్యము హిందీకి లభింపదో, అప్పటి వరకు హిందీభాష సాహిత్య సాంస్కృతిక దృష్టిలో ఉన్నతస్థాయిని పొందలేదు. కేవలము హిందీ ప్రాంతవాసులే హిందీ సాహిత్యవేత్తలని భావింపబడినచో హిందీ భాషాక్షేత్రము సంకుచిత మగుటెగాక ఆ సాహిత్యముగూడ విస్తృతము కాజాలదు.

భారతదేశములోని అన్ని భాషల సాహితీపరులును తమ సాహిత్యమున తమ మాతృభాషలో వెలువరించుటతోపాటు హిందీలో గూడ వెలువరించుచు, తమ భాషలతో పాటు దానికి గూడ సమాన గౌరవ మిచ్చుట భారత జాతీయ జీవిత వికాసమునకు దోహదము కాగలదు. అప్పుడే ప్రతి భాషలోనున్న ప్రముఖ రచయితల ప్రతిభ ఆ భాషలోనే పరిమితము కాకుండ, హిందీ ద్వారా సమస్త భారతావనిలోను ప్రకటితము కాగలదు. అందువలన సమస్త భారతీయ భాషా సాహిత్యములలో గల వివిధ రచనా విధానములను భావసంపదను సాహితీ పరులును కళావేత్తలును సులభముగా అర్థము చేసుకొని, ఒకే సాహిత్యమును, అనగా భారతీయ సాహిత్యమును సృష్టింప గలుగుదురు.

మన దేశములో అనేక భాషలు మాట్లాడబడుచున్నవి. వానిలో ముఖ్యమైనవి పదునాలుగు. కొన్ని భాషలలో అత్యుత్తమ సాహిత్యము

లున్నవి. ఒక్కొ దేశములోనున్న అట్టి సాహిత్యముల పరస్పర పరిచయము ఆ దేశపు జాతీయ జీవిత సౌధమునకు పునాదియనుటలో అతిశయోక్తి లేశమును లేదు.

పైనుదహరించిన లక్ష్యములను సాధించుటకే „ఆంధ్ర హిందీ పరిషత్తు"ను స్థాపించినాము. మన దేశములో నిటువంటిది యిదే ప్రథమ సంస్థయని చెప్పుటకు గర్వపడుచున్నాము.

పరిషత్తు-సాహిత్య ప్రకాశక మాల :

ఈ సాహిత్య ప్రకాశక మాల హిందీ తెలుగు సాహిత్యముల మధ్య సన్నిహితత్వమును ఐకమత్యమును పెంపొందించుటయనెడి లక్ష్యముతో స్థాపించబడినది. ఇది హిందీలోను తెనుగులోను ఉత్తమ సాహిత్య గ్రంథములను ప్రచురించును. ఉత్తమ రచయితలకు ప్రోత్సాహమిచ్చును దీనిని స్థాపించి కొన్ని మాసములైయైనప్పటికిని ప్రముఖులగు అయిదుగురు ప్రాచీన కవుల కొన్ని రచనాభాగములను „పంచామృతము" అను పేరుతో హిందీలో ప్రచురించినాము అది మా ప్రకాశకమాలలో ప్రథమ పుష్పము. ఈ „తెనుగు మీరా" ద్వితీయ పుష్పము. ఇది తెనుగులో నున్నట్లు ఆ పేరే చెప్పుచున్నది.

అత్యున్నతములగు తమ ఆధ్యాత్మిక భావములచే దేశమును పునీతమొనర్చిన మీరావంటి భక్తులకు చరిత్రలో అంతగా స్థానము లేక పోయినను ప్రజలు మాత్రము వారిని మరువలేరు. వారి దివ్యస్మృతులు మానవ హృదయములో యుగయుగాలవరకు చెరుగని ముద్రలువైచును. అట్టి మీరా భక్తి భావనమును తెనుగు గీతికలలో ఆలపించి, ఆమె గాన మాధుర్యమును ఆంధ్రులకు రుచి చూపిన డాక్టర్ రామచంద్రయ్యగారి పరిశ్రమ నెంతయు అగ్గింతును.

ఆంధ్ర విశ్వవిద్యాలయము
వాల్తేరు
30-౧౨-౫౪

జి. సుందరరెడ్డి
జనరల్ సెక్రెటరీ.

# నివేదన

నా చిన్ననాటి మాట. మా తండ్రి శ్రీ ఓరుగంటి వెంకట సుబ్బయ్యగారు న్యాయవాదులు, రామ భజనాపరమున దినదినము నగర సంకీర్తన మేగెడివారు. ఆ రోజులలో నా పుట్టువగుట నాకా దేవుని పేరిడినారు. నా కూహగల్గు నాటికి రామ భజనావసరముల తాత మిత్రు లెత్తికొనగా నేనును ,,ఊరేగు'' వాడను. పితృసమాత్త మా భక్తి నేటికి రూపున వాసించినది.

మా తండ్రిదే అయిన దేశ సేవాపరము వారినేగాక మా తల్లి కీ॥ శే॥ మహాలక్ష్మమ్మను, కీ॥ శే॥ నాకగ్రజులు దర్శనశాస్త్రి, విద్వాన్ శ్రీ వెంకటేశ్వర శర్మ, బి. ఒ. ఎల్. ను నన్నును కారావాస మనుభవింపజేసినది. ఆ దేశసేవలో రేకుగ హిందీలోతుల తడవిన ఆ యన్న కారణముగ కొలది పాటియే యైనను హిందీ నాయొంట బట్టినది.

మా కుటుంబమున మొట్ట మొదలుగ కవితాంకురములు తొడవినది మా యన్న వెంకటేశ్వరుల కగ్రజులును నా ఆధుని కోన్నత విద్యకు ప్రాపు శ్రీ వెంకట సుబ్రహ్మణ్యమున కనుజులను అగు శ్రీ వెంకట కృష్ణయ్యగారు. వారెరిగినదే విద్య. నన్నను గ్రహింపదలచి ,,సద్యఃపర నిర్వృతమే'' నన్ను కవితాంకమునకును శ్రీ అరుణాచల రమణాంతికము నకును జేర్చినారు.

ఇందరింతగా నోమగా, నేను నిమిత్తముగ, మీరా పదములు కొన్ని తెనుగున సట్లు తీరినవి. తొలింటి నా పూజా ఫలముగ, సరస్వతీదేవి చెవిచెంగలువ చిలుకరించిన మధువులు, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి 'పరిచయము' 'స్వరకల్పన'లు నన్ను సుకృతిని జేసినవి. చిక్కని చక్కదనమునకెత్తిన వారి రచన మీరా పదముల నలరించుట మత్కృతి వైశిష్ట్యము. నా యెడవారికి గల్గిన యీయవ్యాజ వాత్సల్యమునకు దోహదము నా మిత్రము శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రిగారు. ''పరిచయమున'' వీరును కృతపరిచయులే.

ఈ పదముల గొన్నింటిని నేను వినిపింపగా తనిసి, శ్రీ జి. సుందర రెడ్డిగారు, నాకొఱిగింపకయే సంవిధానము నెమకి, ఆంధ్ర హిందీ పరిత్తువారి తొలి యత్నముగ నా కృతిని వెలుపరింప గారకులైనారు. కృతజ్ఞతతో నిండిన నాయెదపొంగు, హృదయస్పర్శి నాయంజలి వీరందరను తృప్తుల జేయునుగాక.

''ఎందరో మహానుభావులు
అందరికిని వందనములు''

ఆంధ్ర విశ్వవిద్యాలయము
వాల్తేరు
జయ సం॥ ఆషాఢ శు॥ ౧ మి

మీ రామచంద్ర కౌండిన్య

# పరిచయము

శ్రవ్య కవితావేశ మావరించిన నా చిన్నతనమందు ఎప్పుడో "మీరాబాయి" అను పేర చిన్న పద్యకావ్యము రచించి ప్రకటించి యుంటిని. నాటికి గాని నిన్న మొన్నటి వరకుగాని నాకు మీరాబాయి సంకీర్తనములతోఁగాని చరిత్రముతోఁగాని యెట్టి పరిచయమును ఉండలేదు. ఎవరో చెప్పగానో ఎక్కడనో చదువగానో తెలిసికొన్నది ఆ కథ. హిందీ భాషయందుగాని హిందూస్తానీ సంగీతమందుగాని నాకు గల పరిచయము అతిస్వల్పమగుటయే అందుకు ముఖ్యహేతువు. కొన్ని దినముల క్రింద శ్రీ ఓరుగంటి రామచంద్రయ్యగారు ఐదంపర్యముగా నా వద్దకువచ్చి యిందు ప్రకటితములైన, తాము తెలిగించిన మీరా పాటలకు పాడి వినుపించు వరకు నాయజ్ఞానపు నష్టమెంత గొప్పదో నాకవగతము కాలేదు. ఇప్పుడు అవగతమైనను-ఇఁక మీద నేను హిందీ భాషను నేర్చుకొనుట అసంభవము గనుక మీరాదేవి మూలకృతులను నేరుగా చదివిచూచు భాగ్యము నాకుండదు.

కాని ఆ నిర్వేదమున కవకాశము లేక చేసినారు రామచంద్రయ్య గారు. వారి తెలిగింపు స్వతః కమనీయముగా నున్నది. భాషాంతరీ కరణములందు సామాన్యముగా కానవచ్చు అన్వయ క్లేశములు, అసాంప్రదాయికములైన నడకలు, అధ్యాహార కాంక్షలు ఛందస్సంకరములు మొదలైన అవలయము లిందెక్కడను కానరావు. మీరాబాయి తెలుగులోనే వీనిని రచించి యుండవచ్చు ననిపించును. భాషాంతరీ కరణముగూడ ఒక విశిష్టమైన స్వతంత్రకళ యనుట ఇక్కడ గమనింప వచ్చును. మూల రచన యందలి సారమైన భావమును, ఆర్జవముతో ననుభవించు సహృదయత, దానిని తమదిగా తమ భాషలో పునశ్చర్వణగా భావించు శక్తి, స్వభాషా మర్యాదలు చెడనీయక దానిని పునస్సృష్టి చేయు స్వతంత్ర కావ్యకౌశలము—ఇవి గలవారికి మాత్రమే అట్టి రచన సాధ్యము.

ఈ రచన యింత హృదయంగమముగా నుండుటకు ఇంకొక ముఖ్య కారణమున్నది. మూలరచన గేయరూపము గనుక తెలిగింపు గూడ గేయముగానే సంతరించినారు రామచంద్రయ్యగారు. అందును అసలు గేయముల హిందూస్తానీ రాగతాళములలోనే ఈ తెలుగు రచనను బంధింపక, తమకు సన్నిహితమై ప్రియమైన కర్ణాటకపు వరుసలలోనే ఈ కూర్పు భావించి సాగించినారు. సింధుభైరవి, కమాసు మొదలైన కొన్ని రాగాలు బొత్తరాహాలైనా అవి మనలో చేరి మనవైపోయి యెంతో కాలమైనది. "తిలక్ కామోద్" ఒక్కటె ఇందు పచ్చి హిందూస్తానీ రాగమనుకోవచ్చు. కాని అదిగూడ, నేను 'యదుకుల కాంభోజి' యనియు, కొంతకాలము క్రింద 'ఎరుకల కాంబోది' అనియు, ఇంకను పూర్వ కాలమున 'తెలుగు కాంబోది' అనియు ,పేర్కొన బడిన మన రాగమే ఉత్తరదేశము చేరి నామరూపాలు కొంచముగా మార్చుకొన్నది. కనుక అందు పరకీయ మనుభ్రాంతి మన కక్కరలేదు. మూలమైన మీరాదేవి రచనల రాగాతాళములే నేడును వాడుకలో నున్నవని యెవరును జెప్పలేరు. జయదేవుడు, పురందరదాసు ; మొదలగువారి గేయములవలెనే యివిగూడ భిన్నరుచి సంప్రదాయ జ్ఞానాదులకు లోగి ఎన్నో మార్పులు పొంది యుండక తప్పదు. కనుక ఇప్పటి మీరా పాటల హిందుస్తానీ సంప్రదాయ మునే తెలుగు రచనకును అతికించుట అర్థములేని పారవశ్యము. రామచంద్రయ్యగారు వహించిన యీ రాగతాళ రచనా స్వాతంత్ర్యము ఈ పాటలయందు మనకు ఆత్మీయతను సంపాదించి పెట్టినది. మరియు ఇందుపయోగించినవి గూడ ప్రస్తార సిద్ధములైన గణిత రాగతాళములు గావు; కేవలము పామర శ్రవణములను మాత్రము తృప్తిపరచునట్టి, సంస్కారశుద్ధిలేనట్టి, యిప్పటి సినిమా వరుసలను గావు. మరి పరంపరా శుద్ధములై, గంభీర భావములను స్ఫురింపజేయగలిగి, ప్రాచీన వాగ్గేయ కారకు లాదరించిన రాగతాళము మార్గములే వీరిందాదరించిరి. తాళము లందును చతురశ్ర నడకకంటె ఖండ మిశ్రగతులు గల 'చాపు' తాళములే యీ పాటలలో ఎక్కువగా పరిగ్రహింప బడినవి. సమమైన

చతురశ్రమున కంటె విషమమైన ఖండ మిశ్రత్ర్యశ్రములందే దాక్షి ణాత్యులమైన మనకెక్కువ ప్రీతి యనుట అనుభవ సిద్ధమైన విషయము. జాతీయమైన యీ అభిరుచికి, అభిమానమునకు, హేతువు నూహించుట సులభము కాదు, మరి అనుభవ రసికులకు తత్త్వమే కాని తర్కముతో పని యుండదు గదా.

మరి రామచంద్రయ్యగారి బుద్ధి విశ్వకళా పరిషత్తుల రాయిడిచే ఎంత నిశితమో అంత వారి హృదయము సహజమై ఆధ్యాత్మికచింతా వేదనలచే అర్ద్రమైనది. ఆ వేదనలే వీరిని శ్రీరమణ మహర్షి సన్నిధికి జేర్చినవి; ఆయన వాత్సల్యమును అనుగ్రహమును సంపాదించి ఇచ్చినవి; ఆ మహనీయుని మీద అసాధారణ భక్తిని గలిగించినవి.

"భగవాను నామంబు భజియించువేళఁ
గనులనశ్రులు గ్రమ్మఁ, గాసంతలోన
గర్వించి నసుబోంట్లు గలరె భక్తాళి
సుకృతులంచని చొక్కి సోలుచునుందు"

(రమణస్మరణ పు. ౧౫)

అని యొకచో వీరే వ్రాసిరి. ఈ అశ్రులు, చొక్కుటలు, సోలు టలను ఎందరకో కావ్యరచనా కాలమందు మాత్రము వచ్చెడి అధ్యా సములు. వీరి కవి పరవశముగా అనుభవించి తీరవలసిన అంతరంగిక సత్త్వస్ఫురణలు. సాధారణ పండిత జీవితమును గూర్చి,

"పదము పదము పదము పదజాలమే కాని
హృదయ బాధ సుంతయేని లేదు,
వ్యథ యెఱుంగలేని బ్రదుకువ్యర్థమ్మురా
రమణలీల లెఱుఁగరావె మనస !,

(రమణస్మరణ. పు. ౨౭)

అని వీరు నిర్వేదపడినారు. కనుకనే మీరాదేవి పాటలలో

అచ్చముగా ప్రతిఫలించు అపురూపమైన ఆమె హృదయవేదనను ఈ తెలుగు రచనకెత్తిపెట్టి మనకందీయ గలిగినారు. కాబట్టి అట్లు చేయుటలో మూలరచనయందలి శబ్దార్థముల విశిష్టతను పూర్తిగా వీరు మార్చి తెచ్చినారా, లేక కొన్నిటిని వదలి మరి కొన్నిటిని సొంతముగా కలిపినారా, అందువలన అసలు రచనకు విరుద్ధములైన విషయములేమైనను ఇందు చేరుకొన్నవా ఇత్యాది ప్రశ్నలు నావంటి వట్టి తెలుగు వారికి కలుగు నవకాశము గాని అక్కరగాని ఉండదు. హిందీ మూలముతో గూడ ఇరుగు పొరుగులుగా తెలుగు పాటలను ముద్రించినారు గనుక ఉభయ భాషావిశారదులు రెంటి సారస్యవైరస్యములను చర్చించుకొ వచ్చును. హృదయవేదనా ప్రధానమైన సారస్వత మందు నా దృష్టిలో అది శుష్కమైన బహిరంగ చర్చ.

పాటలలో సామాన్యముగా కానవచ్చు యతి, ప్రాస, పల్లవానుపల్లవ చరణాల పరస్పర సంబంధము మొదలగు సంప్రదాయాలను ఇచట వీరంతగా పాటింపలేదు; యథావకాశముగా యథానుకూలముగా నిర్వహించుకొన్నారు. ఇట్లే ఈ పాటల భాష గూడ, సామాన్య పద సారస్వత సంప్రదాయమునకు కొంత విరుద్ధముగా, ప్రాచీనమై సంస్కృతమైన తెలుగుగానే యేర్పడినది. కాని పై సంప్రదాయములన్నియు ఇంకను 'శాస్త్రపు' అంతస్తు కెక్కియుండలేదు గనుక ఈ రచనా స్వతంత్రత యెవరికిగాని ఉద్వేజకము కానక్కరలేదు. మరి ఈ అసామాన్యత మీరాబాయి భావములందలి యసామాన్యతతో చక్కగా అతుకొని పోయినదనియే చెప్పవచ్చును. భావములు తమవైనప్పుడు గూడ గౌణముగానే యుండక తీరని ఈ నియమాలు పరభావ పునశ్చర్వణా పారవశ్యమందు రచయిత దృష్టిలో ఇంకను దుర్బలములు కాక మానవు. రామచంద్రయ్యగారు ఈ రచనయందు సాధించిన చక్కని చిక్కదనమున కీశైథిల్యము ఒక యలంకారముగానే పరిణమించినది.

రామచంద్రయ్యగారు ఈ పాటలను పాడి వినిపించినప్పుడు వీనిని స్వర తాళములతో ప్రకటించుట మేలని చెప్పితిని. ఆ కైంకర్యమును

వారు నాకే ప్రీతితో నిచ్చినందున ఈ పాటలకు యథాశక్తిగా ఆ రెంటిని సూచించితిని. గమక ప్రధానములగు కర్ణాటక రాగముల స్వరూపమును స్వర రూపములతో పూర్ణముగా వెలువరుచుట యసాధ్యము. సంగీత కళలో వ్యుత్పన్నులైన 'వాసనాపరిపక్వబుద్ధుల'కు ఇందలి సూచనలు చాలునని నా నమ్మకము. స్వరపరచుటలో ఇందాశ్రయింపబడిన పద్ధతి మనదేశమందలి బయకారులందఱును అంగీకరించినదే.

ఇది చాలక ఉపోద్ఘాతము గూడ వ్రాయవలెనను వారి నిర్బంధ ప్రణయమును తప్పించుకోనేరక యీ నాల్గు మాటలు వ్రాసితిని.

ఇక స్వచ్ఛందముగా మీరాబాయి కథను వ్రాసిన నేను ఈ సందర్భమున ఆ మహానీయురాలి సత్యచరిత్రము నుల్లేఖించుట ధర్మము కాని నా కా వివరము లేమియు తెలియవు నా మిత్రులు ఆంగ్ల సంస్కృతాంధ్ర హిందీభాషా పరినిష్ఠితులు శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి గారు వానిని తెలిపిరి. ధన్యవాదములతో వారిచ్చిన ఆ చరిత్ర విషయముల నిందనువాదము చేయుచున్నాను :

“ఆళ్వారుల కంఠనాళముల నుండి వెలువడిన విష్ణుభక్తి సుధాస్రవంతి దక్షిణభారతమునే గాక శ్రీ రామానుజులు నింబార్కులు విష్ణుస్వామి మొదలగు నాచార్య పురుషుల, వారి శిష్యప్రశిష్యుల, అమృతబోధనముల ద్వారా ఉత్తరభారతమును గూడ పవిత్రము నొనరింపసాగెను. కాగా కాశిలో శ్రీ రామానందులు తమ ద్వాదశశిష్య వర్గము ద్వారా జాతి ప్రాధాన్యము నిరసించి 'హరిని భజించువాడే హరికైన వాడు' అని చాటుట కారంభించిరి. వంగదేశమున శ్రీ చైతన్యప్రభు శిష్యులగు రూపసనాతన, జీవగోస్వాములు మధుర భక్తిని ప్రసారితము గావించుచుండిరి. ఏది యెట్లైనను ఆభక్తి ప్రవాహములు రాజస్థానము నందలి మరుభూములలో ప్రభావరహితముగా ఇంకిపోవుచుండెను. మీదు మిక్కిలి నాటి రాజస్థాన వీరులు రక్తమున వసంతోత్సవమాడి తమ జన్మములు కృతార్థములయ్యెనని భావించుచుండిరి. రాజస్థానము భక్తి ధర్మము

నకు అగ్ని పరీక్షగా 'జౌహర్' గుండముల నేర్పాటు చేసికొనెను. అట్టిచో ప్రస్తర ప్రదేశమున పచ్చిక బయలు మొలచినట్లు అవతరించి, రాజస్థాన సామాన్యజనుల శుష్క జీవితములను భక్తి ప్రవాహమున జీవన రసస్నిగ్ధముగా నొనరించిన తపస్వినీమణి మీరా.

మీరా జీవిత స్రవంతి మూడు పాయలు : (౧) జన్మ మొదలు వైవాహిక జీవనము వరకు. (౨) భక్తి పథమున ప్రవేశించి సంఘ సంఘర్షణల రాటుదేరి లోకభావనల నతిక్రమించుట. (3) మాధుర్య భావమున చరమస్థితిని ప్రాపించుట.

మేడ్తా రాజ్యాంతర్గతమైన కుట్కీ గ్రామమున రాఠోరు రావు దూదా పుత్రుడగు రత్నసింహునికి మీరా జనించెను, జనన కాలము ౧౫౫౫-౬౦ విక్రమ శక ప్రాంతము ¶ తల్లి చిన్నతనముననే గతించెను. తాతయైన దూదా చతుర్భుజదేవుని భక్తుడు. తల్లి చనిపోయిన పిమ్మట మీరా తాతగారి యొద్ద పెరిగెను. రావు వీరమదేవుని జ్యేష్ఠ పుత్రుడగు జయమల్లునితో ఆమె చిన్నతనపుటాట పాటలు వెలసినవి. అప్పటి శ్రీ రాధాకృష్ణుల పెండ్లియాటలతో మీరా యెప్పుడు తానై 'గిరిధర గోపాలుని' వరించుకొన్నదో చెప్పలేము. ౧౫౪౨ విక్రమ శక వత్సరమున రావు దూదా గతింపగా వీరమ దేవుడు శాసకుడయ్యెను. ౧౫౭౩ లో మీరాకు మేవాడ ప్రభువగు రాణాసాంగా (సంగ్రామసింహ) జ్యేష్ఠ కుమారుడగు భోజరాజుతో వివాహము సంపన్నమయ్యెను, కాని యా సౌమంగల్య జీవిత మామెకు

---

¶ ఇందభిప్రాయ భేదములు గలవు :

౧౫౬౦ విక్రమ సంవత్సరమని వ్రజరత్నదాసు

౧౫౫౮ విక్రమ సంవత్సరమని భవానిశంకర ద్వివేది

౧౫౭౩ విక్రమ సంవత్సరమని రామచంద్ర శుక్ల

౧౫౫౫-౬౦ విక్రమ సంవత్సరమని డాక్టరు కృష్ణలాలు

చాల కాలము సాగలేదు. ౧౫౨౦ ప్రాంతమున భోజరాజు మరణించెను. పిమ్మట మీరా భక్తి ప్రభావము స్వచ్ఛందముగా రాజపుత్ర స్థానమున ప్రవహింప సాగెను. వీరమదేవుని రాజ్యాధికారులు నిష్కల్మషమైన మీరా జీవిత ప్రవాహము నడ్డగించి కలుషితముజేయ ప్రయత్నించిరి. అసలే స్త్రీ; అందులో విధవ మీదు మిక్కిలి రాజవంశము, ఒక దాని కంటె వేఱొకటి బలవంతమై యామె మార్గము నవరోధింప ప్రయత్నించినవి. కాని యీ యడ్డంకులచేత ఆమె హృదయము విచలితము కాలేదు. మొగలుల సామ్రాజ్యబలమును వణకించు రాజపుత్ర శక్తి మీరా హృదయ ధైర్యము ముందు వృథయయ్యెను. ౧౫౪౦ లో ఆమె వీరమదేవునాజ్ఞకు లోగి మేవాడును వదలిపెట్టెను. ౧౫౪౨ లో గిరిధర గోపాలుని లీలామానుష క్రీడారంగమగు బృందావనము చేరి పరమప్రియుడైన ఆ దేవుని భజనముచేతను సంకీర్తనములచేతను అచ్చటి ప్రత్యణువును పవిత్రము చేసెను. అంతకు పూర్వము ఆమె హృదయముపై నిర్గుణవాద ప్రభావముకలదు. అప్పుడామె 'గగన మహాలు' లో 'శూలశయ్య' పై ప్రియునితో గూడి శయనింపగోరినది. కాని బృందావనము చేరిన పిమ్మట జీవగోస్వామి రూపసనాతనుల చైతన్యమతమునకు చెందిన ప్రేమ పద్ధతిని, సూరదాసుని వల్లభ సంప్రదాయమునందలి మధుర సఖ్యభావములను ఆకళించుకొనెను. నాటినుండి ఆమె క్రొత్త మీరా. ద్వాపరమందలి సర్వగోపికలును, ఈమెగా నవతరించి శ్రీ కృష్ణ ప్రేమ వారాన్నిధిని మునిగి పారముచేరి, తల్లీలాపారమ్యమును లలిత లలితముగా మృదుల మృదులముగా, అచ్ఛమగు స్త్రీ హృదయముతో, వెన్నవంటి నుడికారపు సొంపుతో పాడి బృందలోని దశదిశలను ప్రతిధ్వనింప జేసినది.

'విక్రమ శకపు ౧౬౦౦ ల ప్రాంతమున ఆమె బృందను వీడి ద్వారక యందలి 'రణఛోడ' మందిరము చేరెను. ఆనాటికి ఆమె రమ్య కీర్తనలు నలుదెసల వ్యాపించెను. భక్త శిఖామణులగు హిత హరివంశ, హరిరామ్ వ్యాస్ మొదలగువారు ఆమె దరిజేరి ఆమె భక్తి

భావమునకు ముగ్ధులై అంజలి ఘటించుచుండిరి. తేర్చిన తేనెతేటల బురుడించు గానముతో మెదిపి హృదయములందలి అమాయికమై పవిత్ర మైన భక్తి భావమును శారదచంద్రికవలె చల్లగా ప్రసరింపజేసిన మీరా జన్మము ధన్యము. ఆమె రచనలు హిందీ సాహిత్య వీధులందాచంద్రార్కము మురళి గోపాలుని కాలియందెలరవళుల మొరయించుచునే యుండును. ౧౬౩౦ ప్రాంతమున ఆమె భౌతిక జీవితమును చాలించుకొన్నది.

హిందీ పద సాహిత్యమున ఆమెకుగల స్థానము ఎనలేనిది. ఆమె భావములు అకృత్రిమ రత్నములు. సూరదాసువలె ఆమె యెప్పుడును 'కూట పదములు' రచింపలేదు. మరి అతని రచనలలో 'అద్భుత ఏక అనూపమబాగ్' 'ఉపమా ఏ కననైన గహి' మొదలగు పదములందున్న కావ్యకళా చమత్కారములు ఆమె పదముల నెచ్చటను గానరావు. కావ్యచమత్కారములు, తనకును తన ప్రియునికిని అడ్డువచ్చు శబ్దజాలము ఆమెకు గిట్టనే గిట్టదు. భావము సూటిగా బైలువెడలి కృష్ణుని యురమున పూలలు మాలలుగా విరియుటే యామె లక్ష్యము. అది యామెకు అప్రయత్న సిద్ధము.

ఈమె జీవితమందలి జనశ్రుతులు : మేవాడ్ రాణా యీమెకు పాముతోడిపెట్టె విషపాత్ర మొదలగునవి పంపుట, తులసీదాసు కీమె పత్రము వ్రాయగా అతడు 'జాకేప్రియనరామవైదేహీ' అను పదముతో ప్రత్యుత్తరమిచ్చుట; జీవగోస్వామికి ఈమె 'గోవిందుడొకడే పురుషుడు' అని తీక్ష్ణముగా జవాబిచ్చుట, మొదలగునవి పుక్కిటి పురాణములేయని డా. కృష్ణలాలుగారి నిశ్చితాభిప్రాయము.

తరువాతి వారీమెను తమతమ సంప్రదాయముల పాలొనరించుకొ జూచిరి కాని, పరమ ప్రేమమార్గమే యీమె మెదనుట నిష్కృష్టార్థము. ఈమె జీవితమున గురుదీక్షా సంస్కారములు కానరావు.

ఈమె రచించిన ప్రతి పదము భక్తి రస భోగ్యమైనను.

“మేరేతో గిరిధర గోపాల దూసరన కోయీ
బసో మేరే నైనన్ మే నందలాల్
జోగి మతజా మతజా
హేరీ మైతో ప్రేమదివానీ
మ్హారే చాకర్ రాఖోజీ”

మొదలగునవి అత్యంత ప్రసిద్ధములు. వాని కన్నిటికిని ఇక్కడ చక్కని అనువాదము వెలసినది.

తిరుపతి
జయ సం॥ జ్యేష్ఠ కృష్ణ చతుర్థి.
(౨౦-౬-౫౪)

రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ

# मीरा गीत

## १. माई मैंने गोविन्द लीनो मोल ।

మాయీ మైనే గోవింద లీనో మోల్
లీనో మోల్, లీనో మోల్, గోవింద లీనో మోల్ ॥

కోయీ కహై సస్తా, కోయీ కహై మహంగా
లీనో తరాజూ తోల్ ॥

కోయీ కహై ఘరమే కోయీ కహై బనమే
రాధాకే సంగ ఖిలోల్ ॥

మీరాకే ప్రభు గిరిధర నాగర
అవత ప్రేమకే డోర్ ॥

## २. बसो मेरे नैननमें नँदलाल ॥

బసో మేరే నైననమేం నందలాల్ ॥

మోహనీ మూరత, సాంవరీ సూరత,
నైనాబనే బిసాల్ ।
అధర సుధారస మురలీ రాజత,
ఉర బైజంతీ మాల్ ॥

# మీరా పాటలు

## 1. మాయామాళవగౌళ-మిశ్రచాపు

నేడు గోవిందుని విలిచితి నమ్మా
నే విలిచితి నమ్మా
విలిచి వాని మివుల వలచితి నమ్మా ॥

కొండలు ప్రియమన, నోరులు సరసమన
అందాల బరిణెను కొలజూచి తులతూచి ॥

నిరుపహతి స్థలిలో, నిభృత కుంజమ్ములో
నిరతము రాధికా సంగు, శృంగారుని ॥

మీరా ప్రభు గిరిధర గోపాలుడు
మెరసి నా హృదయ మందిరమున నడయాడ ॥

## 2. ఆనంద భైరవి-మిశ్రచాపు

కనులలో కొలువుండురా, గోపాల ।
కనులలో కొలువుండు, నందనందన నాదు ॥

శ్రావణ మేఘము సౌరు సుభగ
మోహనమౌ మేనితీరు
చేరదేసి కనుల చిలిపి చూపులురల
సుధజిందు మోవిపై, సొబగొందు మురళితో ॥

క్షుద్ర ఘంటికా కటితట సోభిత,
నూంపుర సబ్ద రసాల్ ।
మీరా ప్రభు సంతన సుఖదాయీ
భగత బఛల గోపాల్ ॥

## ३. जोगी मत जा, मत जा, मत जा

జోగీ మతజా, మతజా, మతజా
పాఀయి పరూఀ మై చేరీ తేరీ హూఀ ॥

అగర చందన కీ 'చితా రచూంగీ
అపనే హాథ్ జలా జా ॥

జల ఖల భయీ భసమకీ ఢేరీ
అపనే అంగ లగా జా ॥

మీరా కే ప్రభు గిరిధర, నాగర
జోతీ మే జోతీ మిలా జా ॥

## ४. बादल देख डरी हो, स्याम !

బాదల దేఖ డరీహో, స్యామ ! మై బాదల దేఖ డరీ ।

కాలీ పీలీ ఘటా ఉమడీ బరస్యో ఏక ఘరీ ।
జిత జావూఀ తిత పాణీ పాణీ హుయి సబ భూమ హారీ ॥

మొలనూలి మువ్వలు మొరయ, మంజు
నూపుర రవళితో నొరయ
మీరా ప్రభు సజ్జన సుఖదాయీ
ఏల జాలము భక్తవత్సల గోపాల ॥

## 3. సింధు భైరవి–మిశ్రచాపు

వలదోయి, వలదోయి, జోగీ, పోవ
అడుగు దమ్ముల బడి, యడలు దాసి వీడి ॥

అగురు చందనముల నమరింతు నా చితి
చేతులార అగ్నిదరి కొల్పకే, యరుగ ॥

సెగడు మంటలోన నిలువెత్తు నాబూది
నిండు కరుణ, మెయి నిండుగా నలదకే ॥

మీరా ప్రభు గిరిధర గోపాలక
మేళవింపక నీ జోతిలో నా జోతి ॥

## 4. ఆభేరి–మిశ్రచాపు

జలదముగని జడసితినే, శ్యామ ।

పసుపు కొంగుల నలుపు బలసి బయలు గ్రమ్మి
కురిసి పొదివి పొదివి విరతి సెలుగని, శ్యామ ॥

జాకా పియ పరదేస బసత హై
భీజూఁ బహార ఘురీ ।
మీరా కే ప్రభు హరి
అబినాసీ కీజో ప్రీత ఖరీ ॥

## ५. करुणा सुणो श्याम मेरी

కరుణా సుణో స్యామ మేరీ ।
మైతో హూయ రహీ చేరీ తేరీ ॥

దరసణ కారణ భఈ బావరీ
బిరహా బిథా తన ఘేరీ ।
తేరే కారణ జోగణ హూంగీ
దూంగీ నగ్రబిచ ఘేరీ ॥
కుంజ-బన హేరీ-హేరీ ॥

అంగ బభూత గలే మృగఛాలా
యోతన భసమ కరూఁ రీ ।
అజహుఁ న మిల్యా రామ అబినాసీ
బన-బన బీచ ఫిరూఁ రీ ॥
రోవూఁ నిత టేరీ-టేరీ ॥

ఎందుబోయినగాని సందడించు జలము
లందు దోగిన పుడమి హరితమ్మగా, శ్యామ ॥

పరదేశి ప్రియు జేర వరిగి వాకిట నిలువ
జడి గొల్పి దీనను తడియ జేసెడి, శ్యామ ॥

మీరా ప్రభు హరి యవినాసి సవరింప
గాటంపు ప్రేమనే కరగి మిగులగ, శ్యామ ॥

## 5. శుద్ధసావేరి—మిశ్రచాపు

కరణించి మొరవిన రారా శ్యామ
చరణ దాసి నేరా ॥

దరిసెన మెడ గోరి కోరి కాతరనైతి
వలచి వసివాళ్లైతి రా ।
సరసుడ, నీకయి యరసి జోగి నాచు
వాడ వాడ తిరిగేరా, వనవీధులందు
కుంజ కుంజము వెమకేరా ॥

అజినము మెడదాల్చి, యొడల బూది నలది
ఒడలె బూది గలిపేరా ॥
అందగాని పొందకే రాము నవినాసి
అడవుల బడి పోదురా, కడలేనివగను
వల వల వా పోదురా ॥

జన మీరాకూం గిరిధర మిలియా
దుఖ మేటణ సుఖ భేరీ ।
రూమ రూమ సాతాభయి ఉర మేం
మిటగయీ ఫేరా ఫేరీ ॥
రహూం చరనని తర చేరి ॥

## ६. या ब्रज में कछु देख्योरी टोन ॥

యా బ్రిజ మే కఛు దేఖ్యోరీ టోనా ॥

లే మటకీ సిర చలీ గుజరియా
ఆగే మిలే బాఖా నందజీకే ఛోనా ।
దధికో నామ బిసరిగయో ప్యారీ
'లే లే హురీ కోవు శ్యామ సలోనా' ॥

బ్రిందాబన కీ కుంజ గలిన మే
ఆంఖ లగాయ గయో మన మోహనా ।
మీరా కే ప్రభు గిరిధర నాగర
సుందర స్యామ సుఘర రసలోనా ॥

## ७. मै जाण्यो नाहि प्रभु मिलण कैसी होय री ।

మై జాణ్యో నాహీం ప్రభు మిలణ కైసీ హూయరీ ।
ఆయే మెరే సజనా ఫిర గయే అంగనా
మై అభాగణ రహీ సోయరీ ॥

మీరా గిరిధరు గలియు వంతలెడలి
సంతసమ్మొ బలసేరా ।
అణు వణువున తనువు తనిసి శాంతి విరిసి
రాక పోక సమసెరా, నాగరుని చరణ
దాసిగనే వెలసేరా ॥

## 6. కాపీ–ఆది

వింతలు వింటివటే, చెలీ
వింతలు వింటివటే ।
వ్రేపల్లియలో ముసి ముసి నవ్వుల ॥

గొల్లభామ పెరుగమ్మ బోయెనే
గోవిందుడు దారి తారసిలెనే ।
అవునే ! అమ్మెడి దధినే మరచి
"కొనుడో శ్యామసుందరు కొను"డనెనే ॥

బృందావనిలో కుంజ కుంజమున
మన మోహను లోకనము లెగసెనే ।
మీరా ప్రభు గిరిధారి నాగరుని
కన్నుల ప్రణయ మాధురులు నిండెనే ॥

## 7. ముఖారి–మిశ్రచాపు

ఏ లీల ప్రభు గలియ గలనో, తెలియనే । నే ।
చెలువు డంగణము చేరబారి మరలె,
చెలియ, చెలుపనగాక, నానిదుర కదెయదనా ॥

ఫారూంగి చీర కరూఁ గల కంథా
రహూంగీ బైరాగణ హోయ రీ ।
చుడియాఁ ఫోరూఁ మాంగ బఖేరూఁ
కజరా మై డారూఁ ధోయ రీ ॥

నిస బాసర మోహి బిరహ సతావై
కలన పరత పల మోయరీ ।
మీరాకే ప్రభు హరి అబినాసి
మిల బిఛడో మత కోయరీ ॥

## ८. मैं बिरहिन बैठी जागूँ

మై బిరహిన బైఠీ జాగూఁ,
జగత సబ సోవేరీ ఆలీ ॥

బిరహిన బైఠీ రంగమహలమే
మోతియనకీ లడ్ పోవే ।
ఏక బిరహిన హమ ఐసీ దేఖీ,
అఁసువన మాలా పోవే ॥

తారా గిన-గిన రైన బిహానీ,
సుఖకీ ఘడీ కబ ఆవే ।
మీరా కే ప్రభు గిరిధర నాగర
మిలి కే బిఛుడ్ న జావే ॥

## ९. सखी मेरी नींद नसानी हो

సఖీ మేరీ నీంద నసానీ హో ।
పివకో పంథ నిహారత సిగరీ రైన బిహానీ హో ॥

చీర చింపులు వెట్టి, చెఱగు మెడను జుట్టి,
జోగినై సొలయుదునే ।
గాజులెల్ల విఱిచి, కలచి ... ...
కనుల గాటుక గడుగ, కాంత, ... మారగనే ॥




ఏచి విరాళి నన్నే చెడి రేబవలు
శమి యింపదే నిముసమేని ।
మీరా ప్రభు హరి యవినాసి నెనసిన
మెలత, అనగి పెనగి విడివోనె, గడియేని ॥

## 8. ఆభీరి–ఆది

విరహిణి నే కనుకేని యెఱుగనే
జగము నిదుర గూరేనే ॥

విరహిణి యోర్తుక రంగ మహాలులో
ముత్తెసరుల గూర్చెనే ॥
విరహిణి యోర్తు నా యెఱుకలోనురలు న
శ్రివుల మాల గ్రుచ్చెనే ॥

తారల యెన్నుచు నిశిగడచేనే
మంచి గడియ మరి వచ్చేనా ।
వమోహ
మీరా ప్రభు గిరిధారి నాగరుని
గలసి సుకము తువనందేనా ।తేవి..

## 9. షణ్ముఖ ప్రియ–మిశ్రచాపు

నిదురన్న నేమో మఱచితినే, ప్రియుని
ఎదురు తెన్నులు చూడ, కదల సాగిన రేలు ॥

సబ సఖియన మిల సీఖదయీ, మై ఏకన మానీ హో :
బినదేఖే కలనహీం పరత, జియ ఐసీ ఠానీ హో ॥

అంగ ఛీన బ్యాకుల భయీ, ముఖ పివ పివ బానీ హో ।
అంతర బేదన బిరహకీ, వహ పిరన జానీ హో ॥

జ్యోం చాతక ఘనకోరటై, మఛరీ జిమి పానీ హో ।
మీరా బ్యాకుల బిరహిణీ, సుధ బుధ బిసరానీ హో ॥

## १०. दरस बिन दूखन लागे नैन ।

దరస బిన దూఖన లాగే నైన ।
జబతేం తమ బిఛురే పివ ప్యారే, కబహుం నపాయో చైన ।

సబ్ద సునత మేరీ ఛతియాం
కాంపై మీఠే లాగే బైన ।
ఏకటకటకీ పంథనిహారూం,
భయీ ఛమాసీ రైన ॥

బిరహ బిథా కాసోం కహుం సజనీ,
వహగయీ కరవత నైన ।
మీరాకే ప్రభు కబహో మిలోగే,
దుఖమేటన సుఖ దైన ॥

## ११. पपइया रे पिवकी वाणि न बोल

పపయియారే పివకీ బాణి న బోల్ ।
సుణి పావేలీ బిరహణీ రే థారీ రాలేలీ పాంఖ్ మరోడ్ ॥

చెలులు చెవి నిల్లుగా పోరువెట్టిన నేమి
చెలువుని గనలేమి యుమ్మలించునె మనసు ॥

నవసి సొలసిన తనువు, ప్రియుజీరు పేరెలుగు
పావయు విరహిణి యులివు, తెలియరానిదయేమె ॥

జలము బాసిన మీను, జలదార్థి చాతకము
విరహ కాతర మీరా, వివశ చేతన, చెలియ ॥

## 10. తోడి–మిశ్రచాపు

పరిసెనమే లేక నెఱనొచ్చెనే కన్ను
సరసు బాసిన దాది నెమ్మనోచనె, ప్రియుని ॥

వాని యలికిడి చాలు, ఉల్లముప్పొంగునె,
పలుకు తీయము లొల్కునే ।
వాని పయనము దారి పడిగాపులుందునే
రేయి యుగమై వేచునే, ప్రియుని ॥

విరహ తాపము పెర్మి నేమనందునె, కనుల
ఒంప కోతలు చెరగునే ।
మీరా కుందు బాయ సుక మెనయగ ప్రభువు
చేరువెన్నడు కలుగునే, ప్రియుని ॥

## 11. కమాసు–మిశ్రచాపు

కూయి మానవె కోయిలా, ప్రియు బాణి
రేయి విరహిణి వినిన, కనలి కంఠము సలుసు ॥

చాంచ్ కటావూం పపయియారే ఊపరకాలో రలూణ ।
పివ మేరా మై పివకీ రే తూ పివకహై సమూణ ॥

థారా సబద సుహావణారే జో పివ మేలా ఆజ ।
చాంచ్ మంఢావూం థారీ సోవనీ రే తూ మేరే సిరతాజ ॥

పీ్రతమకూం పతియాం లిఖూం రేకాగా తూం లేజాయ్ ।
జాయి పీ్రతమ జానూం యూం కహైరే థారి బిరహణ ధానన ఖాయ్ ॥

మీరా దాసీ బ్యాకులీరే పివ కరత బిహాయి ।
బేగ మిలో ప్రభు అంతరజామీ తుమబిన రహ్యానజాయ్ ॥

## १२. हो गये स्याम दूजके चन्दा

హో గయే స్యామ్ దూజకే చందా ॥
మధువన జాయి రహే మధు బనియా
మీరా కే ప్రభు గిరిధర నాగర,
అబతో నేహ పరో కఛు మందా ॥
హామ పర్ డారా ప్రేమ కే ఫంచా ॥

## १३. डारि गयो मन मोहन पासी।

డారి గయో మన మోహన పాసీ ।

అంబాకీ డాల కోయిల ఇక బోలై
మేరో మరణ అరుజగ కేరీ హాంసీ ॥

రెచ్చచంచువు చిదిమి, అదుము కారము, వినవె
ప్రియుకేను, నా కతడు, నడుమ నీవెవతవే ॥

స్వరము మధురమె సరస వరపుల దొరయున్న
చంచు శోభిల పసిడి పొదుగింతునే, యిపుడు ॥

ప్రియతమునకు లేఖ నందించి తెలుపవే
విరహార్తి చెలి, పెదవి మెదుకే చేరుపదనవే ॥

వనరు దాని మీరా కేవేళ ప్రియుజపమె
మనసు తెలిసిన సామి నెనయక మనదింక ॥

## 12. కాంభోజి–ఆది

అమవస నెలగా కానేలరా ।
కనుజూపులకే కరవేలరా ॥

మధువన మేగెదవు మాధవా
మమ్మేల మలుప నీవలవుటురుల ॥

మీరా ప్రభు నాగర గిరిధారి
మే కొన్న ప్రేమ పొంగాలె నేర ॥

## 13. పంతువరాళి–మిశ్రచాపు

పన్నిపోయెనె యురులు మన మోహనుడు నేడు ॥

మావి మోసుల పికము చిలికి చేసెనె గళము
చాపు మెత్తుచు నేను, కేరి నవ్వును జగము ॥

బిరహాకీ మారీ మై బన-బన డోలూ
ప్రాణ తజా కరవతల్యూఁ కాసీ ॥

మీరాకే ప్రభు హరి అబినాసీ
తుమ మేరే ఠాకుర మై తేరీ దాసీ ॥

१४. हे री मैं तो प्रेम दिवानी, मेरो दरद न जानै कोय।

హేరీ మైతో ప్రేమ దివానీ
మేరో దరద న జానై కోయ ॥

గగన మండల పర సేజ పియాకీ
కిసబిధ మిలనా హోయ ।
సూలీ ఊపర సేజహమారీ
కిసబిధ సోనా హోయ ॥

ఘాయలకీ గత ఘాయల జానై
కీజిన లాగీ హోయ ।
జౌహరీకీ గత జౌహరీ జానై
కీజిన జౌహరీ హోయ ॥

దరదకీ మారీ బన-బన డోలూఁ
బైదమిల్యో నహీఁ కోయ ।
మీరాకీ ప్రభు పీర మిటైజబ
బైద సాంవలియో హోయ ॥

వలవంతలను జీవికి, కొన కోనల దిరిగి
పోసియు వారాణసి దారి బటుదు నమ్మ్ర ॥

మీరా ప్రభు హరి అవినాసి గిరిధారి
రారాజు తనదాసి నుజ్జగించున యేమె ॥

## 14. హిందోళం—మిశ్రచాపు

ప్రేమ జేసిన వెఱ్ఱినే, నా బాధ
నేమి తెల్పిన నేరికే ॥

ఆకాసమున ప్రియుడు, సవరించ చేనే శయ్యా
అనువేనకే వాని గలియు ।
అలుగు మొనల బొంత అమరింతునే కనుల
గదురునే సుంతేని నిదుర ॥

నొచ్చి నాతడె నొవ్వ నెఱుగు, నావగ లెఱుగ
నొచ్చు నాతని గాననే ।
రవల నైజము దెలియు రవల వణిజుడె నన్ను
దెలియు వణిజుని జూడనే ॥

ఆర్తి పెల్లున యడవి యడవి గాలింతునె
వైద్యు నొక్కని గలియనే ।
మీరా రుజలెల్ల ఘనవైద్యుడా శ్యాము
పజ్జ నుండిన వెలియునే ॥

१५. घर आँगण न सुहावे, पिया बिन मोहि न भावे ॥

ఘర అంగణ న సుహావే
పియా బిన మోహి న భావే ॥

దీపక జోయకహా కరూం సజనీ ।
పియ పరదేస రహావే ।
సూనీ సేజ జహరజ్యూం లాగే,
సిసక సిసక జియ జావే ॥
నైణ నిందరా నహీ ఆవే ॥

కదకీ ఊభీ మై మగజోవూం
నిసదిన బిరహా సతావే ।
కహాకహూం కఛు కహత న ఆవే
హీవడో అతి ఉకలావే ॥
హరీ కబ దరస దిఖావే ॥

ఐసో హై కోయీ పరమసనేహీ
తురత సనేసోలావే ।
వాబిరియాం కదహోసీ ముఝకో
హరి హంస కంఠలగావే ॥
మీరా మిలి హోరిగావే ॥

१६. अब तो निभायाँ सरेगी, बाँह गहे की लाज ॥

అబతో నిభాయాం సరేగీ
బాంహ గహేకీ లాజ్ ॥

## 15. నీలాంబరి–మిశ్రచాపు

వెలితియే గనుపించెనే, ప్రియుఁలేమి
వెలవెల్లనై తోఁచెనే ।
పీటిలోన, వెలిచోటిలో, నేవేళ ॥

వేనికై యింక దీపమ్ముడుదునె యింట,
పరదేశముల రాజు తా రాఁడఁగా ।
వాని పరుండని విరిశయ్య విసమయి
మనసు కటకటలాడెనే, కనులలో
కునుకు మసలుట లేదనే ॥

కాంతు త్రోవలు సూచి కాళ్లు గుదియలు వార
రేరేపులను బాళి రాపాడెనే ।
ఏమనందునె, యేమి బలుక నోరాడదె
ఎదలో నదరు గదిరెనే, హారికను
తుదనెపుడే మెదలేనే ॥

కరుణాళు వెవరేని కలరేని కృపజూపి
వేవేగ ప్రియునిందు రావించునా ।
అంత పున్నెము పండి హారికాగిలింతల
మీరా నవ్వుల నేలునా, జతగూడి
హోలీ నాలపించునా ॥

## 16. కేదారగౌళ–మిశ్రచాపు

పట్టి నందుకు సామి, పడతి మానముగాచు
నట్టి సమయము వచ్చెరా, నా చేయి ॥

సమరథ సరణ తుమ్హారీ సయియాం,
సరబ సుధారణ కాజ ॥

భవసాగర సంసార అపరబల,
జామే తుమహోర్ఝ్యాజ్ ॥

నిరధారాం ఆధార జగత-గురు,
తుమ బిన హోయ అకాజ్ ॥

జుగ జుగ భీరహారీ భగతన కీ
దీనీ మోక్ష సమాజ్ ॥

మీరా సరణ గహీ చరణన కీ
లాజ రఖో మహారాజ్ ॥

## १७. सुनी हो मैं हरि आवन की आवाज

సునీహో మేం హరి ఆవన కీ ఆవాజ్
మహాల చఢ్-చఢ్ జోవూం మేరీ సజనీ
కబ ఆవే మహారాజ్ ॥

..

దాదర, మోర, పపఇయా బోలై
కోయల మధురే సాజ్ ।
ఉమంగ్యో ఇంద్ర చహూం దిసిబరసై
దామణి ఛోడీ లాజ్ ॥

అన్నినేతువు నీయండజేరితి లేగ
అవసరములు దీర ఆదుకోర, తరుణి ॥

భవమన్న మున్నీరు గడవ నోపనురా
నిన్నెగాని యితర తరణి నెన్ననురా ।

అనవల కాలంబమవు లోక గురువవు
చెయి పీడ జతనాలు వితలౌనురా, చెట్ట ।

యుగ యుగముల భక్తజనుల బాముల బాపి
ముక్తి పదమున నిలిపి మురిపింపవా ।

ఏరా, చరణములంటి శరణంటిరా, నీదు
మీరా నిశ్చితినింత వెలిసియుకుర, ప్రభుని !

## 17. యమునాకల్యాణి-మిశ్రచాపు

వినగా నోతునె చెలీ
విభుని పదముల రవళి ।
అన్నువ కానకై, మిన్నంది కోనజూతు
మనోరాజాయన వచ్చునా ॥

కనులు విరిసిన కేకి
మొయిలు కెగసి బలాక
కలనాద మొలికించునే ।
పొంగి మబ్బుల రౌతు
నింగినింగినె గురియ
మెరపు నిగ్గులు సడలెనే ॥

ధరతీ రూప నవా-నవా ధరియా
ఇంద్ర మిలన కై కాఁజ్ ।
మీరాకే ప్రభు హరి అబినాసీ
బేగ మిల్యో సిరరాజ్ ॥

## १८. सोवत ही पलका में मैं तो

సోవత హీ పలకాఁ మేఁ మైఁ తో
పలక రగీ పలమేఁ పివ ఆయే ।
మైఁ జు ఉఠీ ప్రభు ఆదర దేణకూఁ
జాగ పడీ పివ ఢూంఢ న పాయే ॥

ఔర సఖీ పివ సోయి గమాయే
మైఁ జు సఖీ పివ జాగి గమాయే ।
మీరాకే ప్రభు గిరిధర నాగర
సబసుఖ హోయి స్యామ ఘర ఆయే ॥

## १९. कोइ कहियौ रे प्रभु आवन की ।

కోయి కహియౌ రే ప్రభు ఆవనకీ ।
ఆవనకీ మన భావనకీ ॥

ఆపన ఆవై లిఖ నహిఁ భేజై
భాణపడీ లలచానకీ ॥

ఏ దోవు నైణ కహ్యో నహిఁ మా
నదియాఁ బహై జైసే సావన కీ ॥

భువిచాన నెమ్మేన
నవకమ్ము లలరించి
ఇందుప్రగలియగ మురియునే ।
మీరా ప్రభు వవినాసి
హరినాదు సిగపూవు
సరస సరగున విరియునే ॥

## 18. మలయమారుతం–మిశ్రచాపు

కలికి, పానుపుజేరి కనుమూసితినో లేదో
కాంతుడల్లన దోచెనే ॥
వాని పదముల వ్రాలి పలుకరింపగ కనుల
దెఱచునంతకె ప్రియుడు వంచించెనే ॥

ఇతర వనితలు నిదురమునిగి ప్రియు నెడబాయ
కుసుక కేమి బావు కొంటినే ।
మీరా ప్రభు గిరిధారి శ్యామలు డిల్లు
జేర సుకములు సకల మెసలారునే ॥

## 19. మోహన–ఖండచాపు

'అంపి రావింప రమ్మా
వగ కాని ॥

పలుకరింతల మనసు
పులకరింపగ, పిలువ ॥ నంపి ॥

నన్నె గదియుడు కమ్మనైన గిలుకగ రాద
ఏటి ముచ్చట తనకు, యింత నన్నలయింప ॥

